# అరుణ రేఖలు

[గేయాలు]

★

శ్రీ తెన్నేటి సూరి

★

మహోదయ పరిచురణలు

మచిలీపట్టణము



మానవస్వాతంత్ర్య 'మాగ్నకార్టా' పైన
రక్తాక్షరములతో వ్రాలుచేసినాను—



# రేఖలు

# అరుణరేఖ

తరుణారుణ ప్రభా
తరళరేఖను నేను,
తొలిసంజ పొద్దులో
వెలుగు లందించాను... త.

అంధకారముచీరి,
అవతరించాను,
శిఖరేఖనై దిశల
జేవురించాను... త.

చిమ్మచీకటిదారల
చీల్చివేశాను,
దండులేకే వెడలి,
దాడిచేశాను... త.

మృతజీవులెల్లారు
బ్రతుకజేశాను,
చైతన్యమూర్తినై
జీవమిచ్చాను... త.

విప్లవోజ్వాల తరళ
వీరగీతికను—
విశ్వకార్మికుల ప్రా
ణోచ్ఛ్వాస మేను... త.

ప్రాణితతి విప్లవ
శిఖలు రేకెత్తించి,
అండనై, చండగతి,
ముందడుగు వేశాను... త.

విచ్ఛృంఖలమూని, నే
వీరసేనానినై,
అరులపై దూకించి,
శిరసుల్లుత్తోశాను... త.

మానవ స్వాతంత్ర్య
'మాగ్నకార్టా' పైన
రక్తాక్షరములతో
వ్రాలుచేసేశాను... త.

# మాతృగీతి

తల్లిరానేవచ్చె, తడవాయె రారండు !
చల్లగా మన తెనుగుతల్లి రానేవచ్చె—
ప్రణమిల్లి జయగీతి పాడండి మృదురీతి,
ముక్కోటి తెలుగుల్లు మొఱయండి జయగీతి... త.

కనుమలో నీలాలు కరిగి ఒలికెనో యేమొ,
తల్లిజడ, త్రాచులా, కళ్ళల్లో మెసిలింది,
కృష్ణవేణీరుచులె నిజమూ, క్రేపులా
క్రేళ్లురుకు కటిపైన సతమూ... త.

గోదావరీవారి కులుకులవిగోరా !
తెలుగుపల్లెల పొగరు వెలుగు లవిగోరా !
హోషుగా, ఊగుతూ, నీటుజూపేనూ,
దేవికంఠాన కత్తెరదండయేను... త.

పసరుపైరులలోన మిసమిసలు చూడరా !
పచ్చలద్దిన తెలుగు పట్టుచీరేమోను ;
పంటపొలములపైని పసిడిజిలుగదుగోను,
బంగారు, జలతారు, పైటచెరగేమోను... త.

తెలుగుపాటలోని తీపిపాలవిగోను,
తల్లిపలుకులేన చల్లగా పిలిచింది;
అందాలు నగలలో, చిందులాడెనుచూడు
నాగార్జునులచేతి నాజూకు పనులేను... త.

జాజ్వల్యరోచిఃపరిభాజాల మదిగోను!
చండకిరణుడు దిశల మండెనదిగోనూ !!
స్వాతంత్ర్యభానుండు తోచెనదిగోనూ !
దేవీకిరీటకోటీరమణియేను!!... త.

మెఱుగు నాగలిగోరు మేనసోకనో యేమొ
సస్యలక్ష్మిని మేన జలదరించెను తల్లి;
మనభాగ్యములవెల్లి తల్లియేరా !
మనకోరికల కల్పవల్లియేరా!... త.

తల్లిహృదయములోతు తడువుకోరా,
తరళకాంతుల వసువు తరివ్వుకోరా,
ఒకరియాచించేటి గతియేలరా?
పరుల పాదము బట్టు బ్రతుకేలరా...? త.

దేశదేశాలలో తేజరిల్లేవారు,
తెలుగుతల్లికన్న దివ్యసంతానంబు.

తల్లిపూజలవేళ తరలిరారండోయి!
తల్లికీర్తి దిక్కు లెల్ల తెలుపండోయి!—
ఆకాశవీధిలో చీకాకువాయంగ,
ఆంధ్రరాష్ట్రపు కేతనం బెత్తి నిలుపండి... త.

కులములని మతములని కూటికా? గుడ్డకా?
చిలిపి తగవులు రేపు పలుకులేలా?—
ముళ్లమాటలు మీరు మానండిరా,
అమ్మవింటేకోప పడతుందిరా... త.

అంటరాదని యొకడు, అధికుడని మరియొకడు,
గొంతుల్లు కోసుకుంటూరా!—
తల్లికందరు బిడ్డ లొకటేనురా!
తల్లివింటే ఖేద పడుతుందిరా!... త.

యుగయుగాలుగ వీరయోధులనె కన్నదిర,
తల్లివరు వొకయింత తలచండిరా!—
పారతంత్ర్యపు బ్రతుకు బ్రతుకనేలా?—
స్వాతంత్ర్యయోధులై సాగండిరా!!!... త.

# మహోదయం

## ౧

లెండోయి! లెండోయి! బ్రతికిలేవండోయి!
విగతప్రాణుల్లార! మృతశరీరములార!... లెం.

తెలిమించువాకల్లు,
మన ప్రాణరేఖల్లు,
వీకమైన గగనాన
దూకివచ్చిన వవిగో!... లెం.

విశ్వశ్మశానంపు భస్మరాసుల్లార!
'గోరీ' లలోని కంకాళ శిథిలములార!... లెం.

పతితజీవనులార! బానిస ప్రజలార!
గతిలేక పడియున్న! కష్టజీవుల్లార!
మతిలేని జనులార! మృతశరీరములార!... లెం.

కటికచీకటిత్రేని కట్టడములలో జిక్కి—
కొనరు ప్రాణాలతో కుందు ఖైదీలార!
విశ్వకారాగార వీధిలో చెరవడ్డ,
విశ్వకార్మికులార! నిగళబద్ధుల్లార!... లెం.

తొలివెలుగు జిలుగుల్లు, మిలమిలల మించుల్లు,
అమృతంపు వాకల్లు, మనప్రాణ రేఖల్లు,
వీకమై గగనాన దూకివచ్చిన వనిగో!... లెం.

**గండుతొలివెలుగుల్ల**
**దండడికి కనువిచ్చి,**
**ఆకసమె మెసిలింది,**
**ఆవులిస్తున్నాది... లెం.**

అదె 'మహోదయ' వార్త విదితముగ ప్రచురింప,
గగనాన మా ఉషాతరుణి వరతెంచినది—
లెండోయి! లెండోయి! బ్రతికిలేవండోయి!
విగతప్రాణుల్లార! మృతశరీరములార!... లెం.

౨

ఏగుదెంచాడంట వేగుసరదారు,
తొలిదాడికే అరులు తోకముడిచారు—
ఏగుదెంచాడంట వేగుసరదారు,
చిమ్మచీకటి చెరలు వమ్ములైనాయి... ఏ.

చీకటుల లోకాన మాకవిప్లవగీతి,
దిగ్దిగంతాలలో తెలివివెలుగులుదోచె... ఏ.

గగనంబు బ్రతికి, రెక్క విదల్చి, సాచినది,
పురివిచ్చి కారిక యిరులెల్ల రాల్చినది... ఏ.

కరగినది విసువాళ, తరగల్లుకదలాడె,
ప్లవలీల, అవలీల, పాకినదిరాయంచ... ఏ.

ముచ్చువీడిన కాజు విచ్చె తియ్యనిగొంతు
ప్రాభాత కాహళార్భటి మిన్నుముట్టినది... ఏ.

కొమ్మ కొమ్మలలోన, కోనకోనలలోన,
'గమ్మ'మని జయగీతి ముమ్మరించింది,
తొలివెలుగు కత్తుల్ల చలన మొలసింది... ఏ.

చీకట్ల సరదార్లు తోకముడిచేశారు,
కొండగుహాలలొ'దూరి' గుబులుగుబులైనారు... ఏ.

౩

కటిక-చీకటితెరని, కట్టడుల కొడిగట్టి,
ఆరిపోయినయట్టి అన్నిప్రాణాలూ,
'రప్పు'మని యొక్కపరి రగులుకొన్నాయియ్యా,
కీలలై జ్వాలల్లు మాలలైనాయి—
భయదగతి విప్లవ ప్రభలు రేగాయి,
చిమ్మచీకటి చెరలు వమ్మలైనాయి... భ.

హడలి మూర్ఛిలిపోయి, నుడివడ్డ విశ్వంబు
పాణాలు లేకత్తి, బ్రతికి లేచింది,
డొంకల్లు ఘూర్ణిల్ల ఆంకవేసింది... భ.

ఆకాశవివరంబు ఆవులించింది,
ఒడలెల్ల విఱుచుకొని జలదరించింది... భ.

ధర్మగోమాత తా తరలివచ్చింది,
బందెవెల్వాడి మంచి పాలుచేపింది—
సత్యవత్సము తల్లి కుత్సవముగాగ
చెంగుచెంగున దూకి చేరుకొన్నాది... భ.

౪

మిసమిస మించుల పసిడివిమానం,
మిన్నులపైగా నడిగోనోయ్!
వింటను విడిచిన బాణంలాగా,
మింటను రివ్వున దూకిందోయ్!

విభవోజ్జ్వలమై విమానమందున
ఉషాదేవి వచ్చేసిందోయ్!
కట్టినపుట్టపు జిలుగువెలుగులకు
లోకము తెలతెలవారిందోయ్!

జగత్ప్రబోధక విప్లవగీతిక
చీకటిచీల్చుకు వచ్చిందీ—
వితానతలమున, విభవోజ్వలమై,
వీరమూర్తిగా నిలిచింది.

అంబరతలమున, అమృతరేఖయై
చైతన్యాంశువు లాలసింది—
జవరాసులకు ప్రాణగీతియై,
వినువీధిని తా నొలసింది.

"రక్షకలదు ప్రాణుల కెల్లారికి,
శిక్షకలదు దురితావళికి,
అక్షీణోజ్వల కరపవాసుడూ,
జగద్రక్షకుడు వస్తాడు!

బ్రతుకండోయీ! ప్రాణికోటులూ!
భయములువాసీ, బ్రతుకండి!
వెతలనుబాసీ, వీరగభీరత
గుండెలనింపుకు బ్రతకండి—

పేదరికంబు విదల్చుకు పోయిగ,
సంతోషంబున బ్రతుకండి—
దురితౌఘంబుల రూపుమాపగా
చండకరుడు వస్తున్నాడు. ”

౬

విప్లవారుణగీతి వినువీధి జ్వాలియించి,
విశ్వవరిజాహ్వాదయ మూగిపోయింది,
కడలిపొంగులు మింటికందుకున్నాయి... వి.

పొంగిపొరలినకడలి, నింగికాకా తేచి,
దుర్భరితరాజ్యంపు హద్దుదూకింది,—
ఉక్కుకోటలనెల్ల ఊపివైచింది... వి.

తరగలై,
కెరటాల నరుదులై,
ముంపుల్ల వరదలై,
భయదాల ప్రళయమై,
విలయగతి,

ఉల్లోల కల్లోల పోరిల్లిల ఘూర్ణిల్లి
ఉగ్రగతి ముంచెత్తి, ఊగిపోయింది—
ఊవుఊవుకు జగము లూడిదోరలాయి... వి.

౭

చలచలా, మిలమిలా,
నిగనిగా, ధగధగా,
కెంపుల్లు కోనలో ముంపులైనాయి,
బంగారుకాంతుల్లు ప్రభలు రేగాయి,

దివ్యరత్నకిరీట దీప్తియదుగోను,
పసిడిమెయిచాయల్ల భానుడదుగోను !
జ్ఞానభాస్కరు కంటిమెఱుపు లవిగోను !
మ్రానుల్లు, మ్రాకుల్లు మండెనవిగోను—

ఉగ్రగతిమై, ప్రాగ్ది
శాగ్రమున పరతెంచి,
చండకరు డాలమున
మండిపోతున్నాడు !!!—

వేయిచేతులవాడు విక్రమించాడు,
రక్తకవచాలతో రాణువదుగోను !

౮

గిరికందరాలలో,
కరుల శిరములు నరికి,

నెత్తురుల ధారల్లై పారబోశారు,
జయలక్ష్మి పాదాలుతడిపివేశారు.
అంధకారపుతులువ
లందంద తలపడిన,
కత్తుకల మొత్తాల నుత్తరించారు,
కత్తి మొనలతో పొడచి తలలువిసిరారు—
గురుతుచోచగరాని,
గుబురు చింతలతోపు,
చీకట్ల సరదార్ల
శిరసులతో నిండినది—
అంధకారపులోక మంతరించింది,
కళ్యాణలోకంబు కనులువిచ్చింది.

౬

పద్మబాంధవురాక
పవనబాలలు సెప్ప,
లజ్జ రేకులువిచ్చ—
ఠాగిల్లై చెక్కిళ్లు—
ముగుద పద్మినిమేన మురిసింది అత్తరువు,
సొంపుల్ల పోసాలు కెంపులైనవి మోవి,
అంధకారపు లోక మంతరించింది,
కళ్యాణలోకంబు కనులువిచ్చింది.

౧౦

ఉదయభానుడు దివిని కదలివచ్చాడు !
విజ్ఞానభానుండు విప్లవించాడు—
ఎదల చింతలువీడి,
నిదురల్లు పోనాడి,
అమృతాంశువులలోని
కరుదెంచి బ్రతకండి !—
ప్రాభవోజ్జ్వలులౌచు లేవండి !
పారతంత్ర్యమువాసి బ్రతుకండి !!

# కీలు గుఱ్ఱం

౧

కీలుగుఱ్ఱము పైన,
కాలీను కానుకొని,
ప్రాణాలు లేనట్టి
భగవంతుడొచ్చాడు—
ఊరంత ఊరేగుతూ,
ఉత్సవము సారించుతూ—
కూలిమాటడగండిరా!
అన్నాలు
చాలవని చెప్పండిరా!

౨

కంచుగుండెకు కూడ,
కనికరము కలదన్న,
మాయవేదాంతాల
మూటేదో నూరాలి,

జాలగిలబడి మొ)క్కరా!
వినకుంటె,
చెవిటిమొద్దని వీడరా!
కూలిమా టడగండిరా!
అన్నాలు
చాలవని చెప్పండిరా!

3

కోటి చేతులుచాచి,
కోటి గొంతులు మొలసి,
కంచుగుండెలు వగుల,
గర్గోలుగా లేచి,
ముక్కోటి దేవతలు,
మూర్తుల్లు కంపిల్ల,
కూలిమాటడగండిరా!
అన్నాలు
చాలవని చెప్పండిరా!

# కన్నీటి కాలువ

ఆషాఢమాసంబు అడుగుపెట్టింది,
చిటపటా, చిటపటా, చినుకుసాగిందీ,
కప్పతల్లీ లేచి, గబగబలు సేయు,
కాకమ్మ గూటిలో కళవళించిందీ... ఆ.

నల్లత్రాచులపిల్లు కొల్లలుగ లేచి,
పడగల్లు విప్పుకొని పర్వెత్తునటుల,
చరచరా, యీజలను సాగిపోతోంది,
గట్టుఫట్టూ లేక, కదలిపోతోంది,
ఒడ్డులే ఒఱసికొని ఒదిగిపోతోంది,
రెల్లుదుబ్బులమీద పొర్లిపోతోంది—
ఇది భయంకర కాలము !—
ఈనిశీథమున,
కన్నీటికాల్వలో
కాల్వేటునెవరు ?...

* * * * *

"దిక్కులేనిజాతి తెలుగుల్లజాతి,
దిక్కులేనివడుచు తెలుగుల్లవడుచు,

కన్నీటికాల్వలో
కాలుపెట్టినది…"

* * * * *

చినిగి చీకాకైన చిరుపేద పయటలో
పచ్చినెత్తురులాగు పారిందిసెలయేరు—
కన్నీటికాల్వలో,
కాలుపెట్టినది—

* * * * *

ముగుదపెన్నెరికొప్పు, ముడివీడి, దిగజారి,
నీలాలజాలులా నేలజిలుగ్గైపోయె—
తిన్నగా తీయరాదా?
యేమోయి!
వేలిముడి… నీ… చేతగాదా?

* * * * *

దిక్కులేనిజాతి తెలుగుల్లజాతి
దిక్కులేనివడుచు తెలుగుల్లవడుచు—
కన్నీటికాల్వలో
కాలుపెట్టినది…
ఈయాతనాజగం బింత వీడితేచాలు,
ఎచటికైనాపర్వే, యేమైననున్ సరే—
కన్నీటికాల్వలో
కాలుపెట్టినది…

# అస్త్ర సన్యాసం

అస్త్రసన్యాసములు
అప్పుడేనట వోయి!
ముప్పుగడచినలాగు,
చెప్పబోతున్నావు... అ.

సామ్రాజ్య వాదంబు
చచ్చిపోవనె లేదు,
ధనిక వాద పిశాచి
తలలు తెగనే లేదు... అ.

శత్రువదుగో! కొత్త,
సాము చేస్తున్నాడు—
చిచ్చుల్ల పిడుగులా,
వచ్చివేస్తున్నాడు—
కన్ను మూయకు తమ్ముడా!
ముమ్ముందే,
కత్తి దూయర తమ్ముడా... అ.

చూడుమా గరిడీలు,
వీడవోయీ భ్రమలు,

శత్రు శేనము, మిగుల
రాదంట, కీడంట—
కన్నుమూయకు తమ్ముడా!
మున్ముందే,
కత్తి దూయర తమ్ముడా... అ.

ఇంద్రజాలపు విద్య
ఎన్నో క్రొత్తవి నేర్చి,
మిత్తిలా మనపై!
ఎత్తి వస్తున్నాడు—
కన్నుమూయకు తమ్ముడా!
మున్ముందె
కత్తిదూయర తమ్ముడా!

అణువణువు బ్రద్దలయి
ప్రళయమై పోతోంది;
అణువు దెబ్బకె పుడమి
ఆవటించేస్తోంది—
ఒంటిగా కలబడకుమోయీ!
నా వెంట
జంటగా కలసిరావోయీ!... అ.

గగనాన బాంబర్లు,
ఎదర బెబ్బులి 'ట్యాంకు'—
అదిగో! 'ప్రళయం బాంబు'
వడి విసరుతున్నాడు—
'రయ్యి'మని మనవైపు
రానె వచ్చేశాడు—
దూరమింతో లేదురా!
తమ్ముడా!
మీదికే వచ్చాడురా!

అస్త్రసన్యాసములు
అప్పుడే నటవోయి
ముప్పుగడచినలాగు
చెప్పబోతున్నావు... ఆ.

# క్విట్ ఇండియా!

తెల్లదొరా! కల్లుదొరా!
మాయదారి మల్లుదొరా!
ఇల్లువిడిచి దారిబట్టవోయ్!
తెల తెల్లవారె,
కొల్లగొట్టువేళ దాటెనోయ్!
ఓ! మాయదారీ మల్లుదొంగా!
ఇంటివారు మేలుకొన్నారోయ్!

౨

పెద్దమడిసీ నంటువచ్చీ,
మిద్దెలోకి చేరుకోని,
గద్దెనెక్కి, కూరుచున్నావా?
తగవుల్లు రేపీ,
అన్నదమ్ముల చీలదీశావా?
తంపుల్లు పెట్టీ,
తల్లిపిల్లల కెడముచేశావా?
ఓ! మాయదారీ మల్లుదొంగా!
ఇల్లువిడిచి దారిబట్టవోయ్!

౩

కల్లమాట లెన్నొ చెప్పి,
నల్లపూస మిగలకుండా,
ఇలువల్లకాడు చేశావా?
ఓ! తెల్లవాడా!
చిల్లిబొచ్చె చేతికిచ్చావా?... ఓ.

౪

అద్దరాతిరి యేలగాడ,
పెద్దలంతా నిద్దరోగా,
ఇల్లుచక్క బెట్టియేశావా?
ఓ! మాయదారీ మల్లుదొంగా!
ఇల్లుగుల్లచేసి యేశావా?

౫

ఓ! మాయదారీ మల్లుదొంగా!
ఇల్లువిడిచి దాటిబట్టవోయ్!
తెలతెల్లవారె,
కొల్లగొట్టు వేళదాటెనోయ్!
ఓ! మాయదారీ మల్లుదొంగా!
ఇంటివారు మేలుకొన్నారోయ్!

# వట్టి బయలు

౧

ఈసాంఘికాచార ఘోరకారాగార
వాసివై, ఈగతిని, వాపోవగానేల?
బ్రహ్మాండ భాండంబు బ్రద్దలైపోవుగతి
గంభీరరావముల గర్జించుకోవోయి... ఈ.

గర్జించు, గర్జించు
గర్జించు, గర్జతో
గగనంబు
పెటపెటా,
పిదులుకొని,
బ్రద్దలై,
ముక్కలై,
చెక్కలై,
ఊబుములై,
మెఱుపులై,

—※—

పాములోకముతోటి పనియేమిటోయీ !
గంభీరరావముల గర్జించుకోవోయీ !

ఆకాశమన నేమోయని గాబరావవకు ;
ఆకాశమన వట్టి అవకాశమేనోయి !
వట్టిబయలే నిన్ను ముట్టడిస్తోంది,
వట్టిభయమే నిన్ను కట్టివేస్తోంది.

# స్వర్గానికి రోడ్డు

"బ్రతుకంతా భారం, కూ్రరం,
పరిమాణాతీరం, ఘోరం,
పుట్టటమే మహాపాతకం,
చావే యిక మేలు'' నుకుంటూ,
నిరుత్సాహ పడబోకండోయ్!
నిస్పృహాగా వాపోకండోయ్!!

నరచరిత్ర చూసుకు నడవని,
నిరుత్సాహ నీరసులారా!
యుగయుగాల కాలంనుంచీ,
మానవత్వ మేం జేస్తోందోయ్?—

పాతాళపు లోతులనుంచీ,
జలగర్భం చీల్చుకువచ్చి,
భూ భాగపు పొలిమేరల్లో,
పర్వతాల పైగా నడిచి,
ఆకాశపు టంచులదాకా,
స్వర్గానికి రోడ్డేస్తోందోయ్!

కంటకాల కాల్చేసీ,
అరణ్యాల వాతవాడ్చేసీ,
పలుగు రాళ్ళ బండల కొండలు
పలుగులతో గ్రుచ్చేసీ,
యుగయుగాల మానవ కథనం
స్వర్గానికి రోడ్డేస్తోందోయ్!

పైకాలకు టిక్కెట్లిమ్మా,
రాజులనూ, ధనికుల మార్గం,
పుష్పక తెరల విమానాలతో,
స్వర్గానికి జారేసనీ,
నరకంలో పేదల త్రోసే
పద్ధతులిక రద్దయిపోతయ్—
స్వర్గానికి రోడ్డేస్తున్నాం!

గొడ్డళ్ళతో కోనలు నరికీ,
పలుగులతో బండలు పొడిచీ,
అలసిన ఓ అన్నల్లారా!
కర్మవీర కార్మికులారా!
ఇకనెంతో దూరం లేదోయ్!
ఆకాశపు టంచదుగోనోయ్!

నిరుత్సాహ పడబోకండోయ్ !
త్వరత్వరగా పనిచెయ్యండోయ్ !
యుగయుగాలు కష్టించామోయ్ !
ఇక నెంతో దూరం లేదోయ్ !

కష్టానికి నిష్ఠూరపడితే,
అసలెందుకు మొదలెట్టారోయ్ ?
కష్టకాల మంతా గడచీ,
ఈ కాస్తలో వదిలేస్తామా ?

ఎడారిలో ఎండలకోర్చీ,
దాహంతో పనిజేశామే !—
చిట్టడవులు కొట్టేటప్పుడు,
పచ్చిగుండె లెన్నోకోసీ,
పులులకు బలి విసిరేశామే !—
కొండగుహల కోటలనుంచీ,
పిశాచాలు బయటికి వచ్చీ,
'యుద్ధా' లని గాండ్రించేస్తా,
మారకత్తి కోరలు తెరచీ,
'వారబోసి పోవా' లంటే,
పడుచువాళ్ళ ఉష్ణరక్తమే
జలధారలు చేసేశామే !—

త్యాగాలకు వెనుదీశామా ?
భోగాలకు ఆశించామా ?
ప్రాణాలకు భయపడ్డామా ?
యుగయుగాలు కష్టించామోయ్ !
ఇక నెంతో దూరం లేదోయ్ !
ఆకాశపు టంచదుగోనోయ్ !

యుగసంధుల అఖాతాలపై
పాషాణపు వంతెన లేశాం—
హిమాలయపు కొండలులాగా
కష్టదినా లడ్డునిలిస్తే,
కందరాలు కరిగించేసుకు
గర్భాల్లో తొలుచుకువచ్చాం—
యుగయుగాలు కష్టంచేసీ
యోజనాలు నిర్మించామోయ్ !
దినాలలో, ఫర్లాంగుల్లో,
దివ్యభూమి - దీపిస్తోందోయ్ !—

ఈ కాస్తకు బద్ధకించితే
నరకంలో దిగబడిపోతాం—

స్వర్గానికి రోడ్డు

ఈకాస్తకు బద్ధకించితే
యుగయుగాల కష్టం భస్మం—
కష్టానికి నిష్ఠురపడితే
అనలెందుకు మొదలెట్టారోయ్!
కష్టకాలమంతా గడచీ
ఈకాస్తలో వదిలేస్తామా?

# పరవళ్లు

౧

వేటగాళ్లందరూ రండోయా!
కలసి
మాటున్న పులులపై దూకండి... వేట.
పొదలమాటున పులులు
పొంచి తారాడేను,
కన్నసి పసిగట్టి మెసలాలి!
తిన్నగా గురిచూసి కొట్టాలి!... వేట.

౨

పండుటాకుల సబురు దులపండి,
కల్లరంగుల గురుతు తెరుగండి,
బెంగాలులో నున్న,
ప్రాణాలు బలిగొన్న
దెబ్బలున్న నెత్తురు
పేటిలో దాగాయి... పరుగు.

---

* మంత్రిత్రయం భారతదేశానికి ఇంగ్లండులో విమానమెక్కటం — భారత దేశంలో ఈ పాట వెలువడటం — రెండూ ఒకే ముహూర్తం!

అటుచూపి, ఇటుచూపి,
త్రుటిలో మోసంజేసి,
విడదీసి, మీమీద
ఇదే, దెబ్బతీస్తాయి——
ఒంటిగావరవళ్లు మానండిరా!
జంటులంతా కలసి పోరండిరా ...వేటు.

# నీ కవి

నీకవిని బ్రతికించుకోవాలిరా!
నీవు మనిషనిపించుకోవాలిరా!
బ్రతికియున్నన్నాళ్లు పట్టెడన్నము నిడవు,
అతడు చచ్చినవెనుక అంగలాలంటావు... నీకవిని.

కూడుగుడ్డ నీకు కావాలెనన్నాడు
తనమాట మరచి నీకొరకె వాపోయాడు... నీకవిని.

రచ్చలో నీమాట తెచ్చివాదించాడు,
విచ్చుకలమూని, నీశత్రువులచీల్చాడు... నీకవిని.

చండమార్తాండుడై ముందడుగువేశాడు,
'అండ నేనున్నాను రండిరా!' యన్నాడు... నీకవిని.

రణదుందుభిని ముందుచరచాడురా,
తొలిబాంబు విసరింది వాడేనురా,
కలియబడ్డది మొదట వాడేనురా,
తొలికత్తి దూసింది వాడేనురా... నీకవిని.

'అన్నము' ని నీకొరకు అరచాడురా!
కన్నతల్లై జాలిగొన్నాడురా,
'చిన్నితమ్ముడ' యంచు పిలచాడురా - నిన్ను
పిన్నపెద్దలలోకి తెచ్చాడురా... నీకవిని.

రక్తంబె నీకొరకు ధారబోశాడురా,
జీవితము నీకొరకు వారబోశాడురా... నీకవిని.

గగనాన కీర్తిస్థ కదిలాడురా, వైరి
కంచుకుండలు పగుల గర్జించినాడురా,
ప్రాణాలు వర్షించి ప్రీతించినాడురా,
ప్రజలకమృతవృష్టి కురిసిపోయాడురా... నీకవిని.

మిలమిలల క్రొక్కాంతి మెఱుపులా మెరిశాడు,
'నవ్యమని' అంధకారపు డొక్క చీరాడు... నీకవిని.

అంధకారపు డొక్క చీరాడురా—
కాళరాత్రి నోరు తెరచిందిరా,
కసిరేగిన పిశాచి గళ హాలాహలి విసర
మానుగాని 'రయ్యా' మని కూడిక్కుగొంటోంది ... నీ.

దెబ్బతిని పిచ్చెత్తి బొబ్బపెట్టిందిరా,
ప్రళయగతి లంఘించి విలయమ్మై దూకింది
    అగ్నిగుండాలలో ఆకళ్లచిచ్చులో
    కవికుమారునిబట్టి కసిరి విసిరేసింది... నీకవిని.

నీకవిని బ్రతికించుకోవాలిరా !
నీవు మనిషనిపించుకోవాలిరా!
    బ్రతికియున్నన్నాళ్లు పట్టెడన్నము నిడవు
    అతడు చచ్చినవెనుక అందలాలంటావు... నీ.

# రాగరేఖ

౧

ప్రణయభాగ్యాలలో
ప్రసవమంజరులలో
పులకించు ననుమేన
పవళించి,
పొలోడి
పలికించు కిన్నెరకు
పంచమస్థాయి నేనూ,—
అనిలాల
ఊలలో రాలిపడినాను—
కదలింపబోకునన్ను,
కొనగోట
మొదిలింపరాకునన్ను

౨

రింగులై, రింగులై
ఈ ప్రపంచావధికి
ప్రక్వేటినాదాల

పలికించుకోగలను
నా హృదయతంత్రి మీటి—
కదలింపబోకు నన్ను,
కొనగోట
మెదిలింపరాకు నన్ను.

3

పాటపైపాటగా,
గీతిపైగీతిగా
రాగాలు తీసుకుంటూ—
గీతాలు పాడుతుంటే—
లోకాలు సొక్కిపోవా?
స్వర్గాల
బేగాలు వ్రీగిపోవా?—
కదలింపబోకు నన్ను,
కొనగోట
మెదిలింపరాకు నన్ను.

౪

ప్రకృతి ముగ్ధా నవ
[illegible]
[illegible],

కంపించింది, కంపించింది,
కంపించింది, కంపించింది,
కదలి నునుపవనాల
తీగలతో సాగిపోతా—
అంబరపు
గోళాల
రావములు
మేళవిస్తా—
అమరాళి
రాగాల గోలలో
రాలి మూర్ఛిల్లుతా—
కదలింపబోకు నన్ను,
కొనగోట
మెదిలింపరాకు నన్ను.

# తిండికావాలి

తిండికావాలోయి! తిండికావాలి!
మండేటి పేగులకు తిండికావాలి!
కడుపులో చిచ్చుల్లు మెదులుతున్నాయి!
చిచ్చుల్ల గుణ్ణాలు చిటులుతున్నాయి... తిం.

గుండెలో రక్తాలు మసులుతున్నాయి,
ఉప్పులై పేగుల్లు కుములుతున్నాయి,
గర్భాన ప్రళయాలు కదులుతున్నాయి,
ఘోషిల్లి భూమాత శోషిల్లినాది... తిం.

కడలిగర్భాలలో విలయాలు మసిలి,
భుగభుగా బడబాగ్ని పొంగిపోతోంది... తిం.

వెటకారి ధర్మాలు, వెఱ్ఱివేదాంతాలు,
పిచ్చినీతులు చెప్పి, వచ్చిచెబుదామన్న
ఆకల్లు మానందిరా!
ఆకలౌతున్నాదిరా!

జనమర్దులార ! ఓ హింసకాములార !
అధికారకాంక్షల్ల బధిరాంధులార !
తఖ్తల్లు దిగి మీరు తరలిపొండోయి!
కరువురాక్షసిపైన కలియబడతాము... ౧౦.

పతులల్లేకూలి, పాలికాలుగాలి,
'కలకటా' వీధుల్ల కల్పించలేము ;
జగమెల్ల 'బెంగాలు' చెయ్యబోకండోయి !
ఆకళ్ల క్షితులలో వాతిముకాలేము... ౧౧.

అగ్ని రేగిందంటె ఆగేది లేదు,
చలిచీమలల్లేను చచ్చేది లేదు,
'కలకటా' గాథల్లు మరల తెస్తేను,
వేవేల ఖడ్గాలు విచ్చుకొన్నాయి.

# న ర బ లి

పోతరాజుల్లార ! పోలేరుమాయమ్మ !
హాముల్లుమునేటి, గ్రామదేవతలార !
దణ్ణాలు ! దణ్ణాలు ! తరలిపోండయ్యా !
దాసుళ్లదణ్ణాలు ! తరలిపోండయ్యా !
కొలువుల్ల నీపైన కొలుచుకోలేము,
జాతరలనీపైన జరుపుకోలేము.... పో.

దుత్తలతో రక్తాలు తెచ్చుకోలేము,
పెద్దగా నరబలులు పెట్టుకోలేము,
నరజాతిగుండెలో నల్లయే లేదు,
కష్టజీవుల మీన కండలే లేవు... పో.

౨

గుడ్లురిమి మామీద కోపగిస్తారా ?
కొండక్రింది యుద్ధాలు కురిపించుతారా ?
కొరడాలతో కొట్టి కోయించుతారా ?
నల్లుల్లై కాల నలిపివేస్తారా ?... పో.

## 3

బొజ్జల సోమారి పోతరాజయ్యా !
కోపాల శాపాల నాపండిసామీ !
జాతరలన్నీపైన జరుపుకోలేమూ,
నరబలులు తేలేము, నల్ల తేలేము ... పో.

# ము ర ళి

ఎదలోన మత్తులా
నిదుర ముంచేస్తోంది,
నీ మురళి మ్రోయించకోయీ!
నరజాతి
కిది నిదురవేళ కాదోయీ!

వీరులంతా లేచి వెడలివస్తున్నారు,
కత్తుల్లుదూసేసి కదనానకూకేరు,
ఇది మహోదయవేళరా!
రణమునకు,
శూరులురకే జాడ గా!... నీమురళి.

కొమ్ముబూరా లేమిచేశారురా?— ఊదు.
పాంచజన్యము లెచటదాచారురా?
దశదిశలు ఘూర్ణిల్లి దద్దరిల్లిపోవాలి,
శంఖారవము చేయరా!
విలయగతి,
సింహనాదము చేయరా!... నీమురళి.

# ప్రపంచ విప్లవం

ఓ... ...
ఓ...ఓ...ఓ...ఓ...
ఓ...హోహో...హో...
ఓహోహోహో... ఓహోహో...హో
ఓహోహోహో హో...
ధీరుల్లారా...! శూరుల్లారా!
యువకుల్లారా!... యోధుల్లారా!
విప్లవజీవుల్లారా!
వీరులార! విజయులార...ఓ....

ప్రపంచవిప్లవ శంఖారావం
వీరుల్లారా! వెడలండీ
విజయమహోదయ ఘంటారావం
కార్మికులారా! కదలండి... ప్ర.

ప్రజావిప్లవపు భయదారావం
మానవులారా! రారండీ
బానిసజాతుల స్వాతంత్ర్యసమరం
రాజుకున్నది కదలండీ... ప్ర.

మానవజాతికి ఆఖరుయుద్ధం
యోధుల్లారా! నడవండి,
నరనారీజన విప్లవగీతం
వీరమూర్తులై పాడండి... ప్ర.

కసాయిశక్తుల తుపాకిగుండ్లకు
ఎదురై గుండెల నొడ్డండి—
ప్రళయంబాంబుల విలయా లవిగో!
వీరయోధులై నిలువండి!... ప్ర.

చీకటిలోకపు ఆఖరుయుద్ధం
జీవుల్లారా! నడువండి
కార్మికజనములూ, కష్టజీవులూ,
బానిసజాతులు, బ్రతుకండి...ప్ర.

మహోదయం... శుభోదయం
జగజ్జనాళికి సుఖోదయం
కష్టజీవులకు,
కార్మికజనులకు,
మహోదయం - నవ - యుగోదయం... ప్ర.

కృష్ణాస్వదేశీ ముద్రాక్షరశాల - మచిలీపట్టణము.

**Check List**

| | | | |
|---|---|---|---|
| **Book Number** | G.V.PDIA247 | **Date** | 31/10/2020 |
| **Front Cover** | yes | **Back Cover** | yes |
| **Blank Pages** | 4/53 | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared** | Lakshmi | **Scanned** | Mounika |
| **BOOK SIZE** | H 7 W 4.9 | **Pages** | 57 |